# ముండకోపనిషత్తు

(అధర్వణ వేదం నుండి)




వ్యాఖ్యాత :

'అభినవ వ్యాస' 'జ్ఞానప్రపూర్ణ'

**శ్రీ దేవిశెట్టి చలపతిరావు**
B.Sc., (Ag)

ఆధ్యాత్మిక జ్ఞానపీఠం – చిలకలూరిపేట

# పూజ్య గురుదేవులు



'అభినవ వ్యాస' 'జ్ఞానప్రపూర్ణ'

## శ్రీ దేవిశెట్టి చలపతిరావు

B.Sc., (Ag)

వ్యవస్థాపకులు :

ఆధ్యాత్మిక జ్ఞానపీఠం - చిలకలూరిపేట

# ముండకోపనిషత్తు

## తొలిపలుకు

ఈ ప్రపంచంలో ప్రతిమానవుడు – అతడు తెలివిగల వాడైనా, తెలివితక్కువ వాడైనా, ఉన్నవాడైనా, లేనివాడైనా, చిన్నవాడైనా, పెద్దవాడైనా, – ఎవరైనాసరే ఆనందాన్నే కోరుకుంటున్నారు. దుఃఖాలు వస్తే వెంటనే తొలగిపోవాలనుకుంటున్నారు; అసలు దుఃఖాలే రాకూడదని అనుకుంటున్నారు.

వచ్చిన దుఃఖాలు తొలగించుకోటానికి; అలాగే లేదనుకున్న సంతోషాన్ని, ఆనందాన్ని పొందటానికి ఎన్నెన్నో పనులు చేస్తున్నారు; ఎన్నెన్నో ఆలోచనలు చేస్తున్నారు; ప్రణాళికలు వేస్తున్నారు.

డబ్బుసంపాదిస్తున్నారు; వస్తువులు సేకరిస్తున్నారు; పెళ్ళి చేసుకుంటున్నారు; బిడ్డలను కంటున్నారు; ఇళ్ళు కట్టిస్తున్నారు; తోటలు, దొడ్లు, భూములు కొంటున్నారు; కోరిన తిండి తింటున్నారు; హాయిగా నిద్రపోతున్నారు; వ్యవసాయం చేస్తున్నారు, వ్యాపారాలు చేస్తున్నారు, పరిశ్రమలు స్థాపిస్తున్నారు; చేతి వృత్తులు చేస్తున్నారు; అధికారాన్ని సంపాదిస్తున్నారు; బ్యాంకులలో డబ్బు దాచుకుంటున్నారు. ఇలా ఎన్నో చేస్తున్నారు. క్షణం తీరిక లేకుండా కష్టపడుతున్నారు. అయినా ఏమిటో – ఎవరిని కదిలించినా అసంతృప్తే.

ఇంకా ఏదేదో కావాలని, ఏదోలేదని; ఉన్నది చాలదని; రకరకాల కథలు వినిపిస్తారు. కొందరు ఎవ్వరికీ వినిపించరుగాని, వారిలో వారే కుమిలి పోతుంటారు. ఎంత సంపదలున్న వారైనా, ఎందరు బిడ్డలున్న వారైనా, ఎంతటి గొప్పగొప్ప పదవులున్న వారైనాసరే 'మేము హాయిగా

ఆనందంగా ఉన్నాం. మాకే కొరతాలేదు' అని సంతృప్తి పడి ఆనందంగా ఉన్న వారే లేరు. సంతోషం కూడా ఉంటుంది. ఐతే సంతోషంగా ఉన్నారనుకున్న వారిలో కూడా ఏదో అసంతృప్తి. ఈ సంతోషం ఎప్పుడు మాయమై పోతుందోననే బెంగ – దిగులు. గట్టిగా కొందరు గుట్టుగా కొందరు ఏడ్చేవారే.

దీనిని బట్టి మనకొక విషయం తెలుస్తుంది. మనకు కావలసింది తాత్కాలిక సంతోషంకాదు. శాశ్వతమైన ఆనందం. దుఃఖమేలేని ఆనందం. భయంలేకుండా అనుభవించే ఆనందం. మరి ఈ వస్తువులద్వారా, వ్యక్తుల ద్వారా, డబ్బు ద్వారా, సంపదలద్వారా, పదవులద్వారా, కర్మలద్వారా, విషయాలద్వారా వచ్చే ఆనందం తాత్కాలికమైనదేగాని శాశ్వతానందంకాదు. స్వర్గలోకానందం కూడా ఇంతే. ఇది ఎప్పుడు అంతమై పోతుందో, ఎప్పుడు కష్టాలు వచ్చి మీదపడతాయో అనే భయంతో కూడిన ఆనందమేగాని – దుఃఖంలేని, భయంలేని, అంతంలేని, శాశ్వత ఆనందం కాదు. ఎందుకని ఇలా జరుగుతున్నది? ఎంతప్రయత్నించినా శాశ్వతానందాన్ని, నిత్యమైన ఆనందాన్ని ఎందుకు పొందలేక పోతున్నాం?

దీని కొక్కటే కారణం. మనం అనిత్యమైన వస్తువులను పట్టుకున్నాం కనుక వాటి ద్వారా వచ్చే ఆనందం కూడా అనిత్యమైనదే అవుతున్నది. మనం నిత్యమైన వస్తువును పట్టుకొన్నట్లైతే మనకు వచ్చే ఆనందం కూడా నిత్యమైనదే అవుతుంది.

ఈ జగత్తు – ఇందులోని విషయాలు అనిత్యమైనవి. మరి నిత్యమైన వస్తువేమిటి?

**"నిత్య వస్త్వేకం బ్రహ్మ తద్ వ్యతిరిక్తం సర్వం అనిత్యం"**

అని శంకరాచార్యుల వారు **'తత్త్వబోధ'**లో తెలియజేశారు. కనుక నిత్య వస్తువు **ఆ బ్రహ్మమే**. అంటే పరమాత్మయే – అదితప్ప మిగిలిన వన్నీ అనిత్యమైనవే.

దేనికి పుట్టుక, నాశనం ఉన్నాయో అది అనిత్యం. **ఈ జగత్తు** పుట్టుకకు ముందులేదు. ప్రళయం తర్వాత కనిపించదు. ఆది–అంతాలలో ఏదిలేదో – అది మధ్యలో కనిపించినను లేనిదే అనిగ్రహించాలి. కనుక ఒక కాలంలో కనిపించి – మరొక కాలంలో కనుమరుగయ్యే ఈ జగత్తు కూడా మిధ్యయే. లేనిదే. అనిత్యమైనదే. ఆది అంతాలలో ఉండి, మధ్యలో కనిపించకపోయినా అది ఉన్నదే. నిత్యమైనదే. సత్యమైనదే.

మనం సినిమాహాల్లో ప్రవేశించినప్పుడు అక్కడ **తెర** ఉన్నది. సినిమా అయిపోయిన తర్వాతా తెర ఉన్నది. మధ్యలో సినిమా వేసినంతసేపూ తెరకనిపించదు. కారణం? మనం ఆ సినిమా కథతో తాదాత్మ్యం చెందటం వల్ల; అందులోని విషయాలలో మునిగి పోవటం వల్ల. కాని, అప్పుడు కూడా నిజంగా తెర ఉన్నది. మరి **సినిమాయో**? ముందులేదు. ఆపిన తర్వాత కనిపించదు. కనుక మధ్యలో కనిపించినా అది అనిత్యమే. లేనిదే – మిధ్యయే.

అలాగే ఈ జగత్తు మిధ్య – దీనికి వెనుక ఆధారంగా ఉన్న ఆత్మ లేదా పరమాత్మ నిత్యం. సత్యం.

మనం సినిమాలో తాదాత్మ్యం చెందితే అందులోని పాత్రల కష్టాలకు చలించిపోతాం, దుఃఖిస్తాం. ఆ పాత్రలు ఆనందిస్తే ఆనందిస్తాం. కనుక సినిమాలో లీనమైతే కొత్తగా సుఖదుఃఖాలు తెచ్చుకుంటున్నాం. ఆ సినిమాను గనుక పట్టించుకొనక పోతే – దానిలో మునిగిపోకపోతే మనకు ఏ సుఖదుఃఖాలు ఉండవు. అనిత్యమైన సినిమాను నిరసిస్తేనే – తొలగిస్తేనే నిత్యమైన ఆధారమైన తెర మనకు కనిపిస్తుంది. సుఖదుఃఖాలు తొలుగుతాయి.

అలాగే అనిత్యమైన ఈ జగత్తులో మునిగిపోయిన మనం అనేక సుఖదుఃఖాలను తెచ్చుకుంటున్నాం. ఈ అనిత్యమైన జగత్తుతో తాదాత్మ్యం వదిలిపెడితే – నిరసిస్తే – తొలగిస్తే – ఈ జగత్తుకు ఆధారమైన ఆత్మను దర్శిస్తాం. ఆ ఆత్మానందాన్ని అనుభవిస్తాం.

ఆత్మ ఆనందస్వరూపం, జ్ఞాన స్వరూపం. అదే నీ స్వరూపం. నీ నిజ స్వరూపం. నేను ఈ దేహాన్ని అనేభ్రమలో ఉన్నంతకాలం దుఃఖాలు తప్పవు. నేను ఆత్మను అనే అనుభూతి పొందితేనే ఆనందం. శాశ్వతానందం. బ్రహ్మానందం.

అట్టి **ఆత్మాను భూతిని పొందటానికి మనకు ఎట్టి జ్ఞానం కావాలో ఆ అద్భుతమైన 'జ్ఞానం' ఉపనిషత్తులలో భద్రపరచబడి ఉన్నది.** ఈ ఉపనిషత్తులు వేదాలకు అంతంలో ఉన్నవి కనుక వీటిని **'వేదాంతము'** అని పిలుస్తారు.

వేదాంతము అంటే ఉపనిషత్తులలో భద్రపరచబడి ముక్తిని – మోక్షాన్ని **– కైవల్యాన్ని ప్రసాదించే జ్ఞానభాండాగారం అని భావం.**

ఇలాంటి జ్ఞానాన్ని అందించే ఉపనిషత్తులు, 4 వేదాలలోను కలిపి 1180 ఉన్నాయని పెద్దలు అంటారు గాని వాటి పేర్లు కూడా తెలియదు. మొత్తం మీద పండితులు పరిశోధనలు చేసి దాదాపు 300–350 ఉపనిషత్తులను బయటకు తీశారు. అయితే ఇవన్నీ తాళపత్రాలలో ఉండటం వల్ల అనేకం శిధిలమై పోయాయి. అందులో 108 ఉపనిషత్తులు మాత్రం పేర్లు మంత్రాలతో సహా ప్రచురించబడ్డాయి. వీటిలో 10 ఉపనిషత్తులకు శంకర, రామానుజ, మధ్వాచార్యులు – భాష్యాలు వ్రాశారు. వీటిని ముఖ్యమైన ఉపనిషత్తులుగా ముగ్గురు ఆచార్యులు గుర్తించారు.

అవి 1.ఈశ 2.కేన 3.కఠ, 4.ప్రశ్న, 5. ముండక, 6. మాండూక్య, 7.ఐతరేయ, 8. తైత్తిరీయ, 9.ఛాందోగ్య, 10.బృహదారణ్యక ఉపనిషత్తులు.

అన్ని ఉపనిషత్తులలోని భావాలు, సిద్ధాంతాలు, ఈ దశోపనిషత్తులలో సమగ్రంగా లభిస్తాయని భాష్యకారుల నిర్ణయం.

ప్రస్తుతం మనం అధ్యయనం చేయబోతున్న ముండకోపనిషత్తు దశోపనిషత్తులలో ఒకటి – అతి ముఖ్యమైనది; బహుసుందరమైనది; అత్యున్నతమైనది. జిజ్ఞాసువులకు – పరిశోధకులకు ఎంతో ఉపయోగకరమైనది.

ఈ ముండకోపనిత్తు 3 భాగాలుగా విభజించబడింది. ప్రతి భాగము మళ్ళీ రెండు ఖండాలుగా విభజింపబడినది మొత్తం మంత్రాలు 64. అంటే మూడు అధ్యాయాలతో– ఆరు ఖండాలతో – 64 మంత్రాలతో శోభిస్తున్నది.

అంటే **మూడు పూలు, ఆరు కాయలు, 64 కళలతో** ప్రకాశిస్తున్నదన్నమాట.

ఈ ఉపనిషత్తు వేదాలలో నాలుగవ వేదమైన **అధర్వణవేదం** లోనిది.

**'ముండకోపనిషత్'** అనే పేరు ఈ ఉపనిషత్తు కెలా వచ్చింది?

'ఈశ' అనే పదంతో మొదటి మంత్రం ప్రారంభమైనందున ఈశావాస్యోపనిషత్ అనేపేరు; కేన అనే పదంతో మొదటి మంత్రం ప్రారంభమైనందున కేనోపనిషత్ అని మొదటి రెండు ఉపనిషత్తులకు పేర్లువచ్చినవి. కాని ఈ ఉపనిషత్తులోని మొదటి మంత్రం బ్రహ్మాతో ప్రారంభమైనదేగాని 'ముండక' అనే పదంతో ప్రారంభంకాలేదు. కనుక ఈ ఉపనిషత్తులో నిక్షిప్తమైన జ్ఞానానికి ఈ పేరుతో ఏదో సంబంధం ఉండి ఉండాలి. అదేమిటో చూద్దాం.

'ముండకం' అంటే 'మంగలి కత్తి' అని ఒక అర్థం. మంగలి కత్తి తలపై ఉన్న వెంట్రుకలను అవి నల్లనివిగాని, నెరిసి తెల్లబడినవిగాని పూర్తిగా తొలగించి తలను నున్నగా ఎలా గుండు చేస్తుందో – అలాగే ఈ ఉపనిషత్తులోని జ్ఞానం మన తలలో ఉన్న ఆశలను, కోరికలను అజ్ఞానాన్ని, పూర్తిగా తొలగించి మన బుద్ధిని శుద్ధం చేస్తుందని భావం. ఇదే చాలామంది అంగీకరించిన వివరణ.

'ముండకం' అంటే మరొక అర్థం కూడా ఉంది. గుండు చేసిన తలగలవాడు – అంటే బోడిగుండువాడు అని – అంటే సన్యాసి అని అర్థం. ఇది సన్యాసులకు బోధించదగినది అని కొందరు చెబుతారు గాని ఈ భావం సర్వాంగీకారం కాదు. అసలు ఈ ఉపనిషత్తును బోధించింది గృహస్థుడైన శౌనకునికే. సన్యాసమంటే కాషాయ వస్త్రం ధరించుట – గుండు కొట్టించుట అనికాదు. "సమ్యక్న్యాసః ఇతి సన్యాసః" అంటే సరియైన త్యాగమే సన్యాసము అని.

'తలలు బోడులైన తలపులు బోడులా'! అని వేమన కవి చమత్కరించాడు. ఆశలు త్యాగం చెయ్యాలిగాని, కేశాలు త్యాగంచేస్తే ఏం ప్రయోజనం లేదు.

**ఈ ఉపనిషత్తును అధ్యయనం చేస్తే, తలలేగాక, తలపులు కూడా బోడులవుతాయనే అర్థంలో గ్రహించవచ్చు.** అలాగే అవ్యయమూ, శాశ్వతము అయిన కైవల్య ప్రాప్తికి, మోక్షప్రాప్తికి 'సన్యాసం' యొక్క ఆవశ్యకత ఉన్నదని ఈ ఉపనిషత్తులో వక్కాణించటం జరిగింది. కనుక ఈ ఉపనిషత్ ఉన్నతస్థితిలో ఉన్న సాధకులకు ఉద్దేశించింది అని కూడా చెప్పుకోవచ్చు.

ఇక **'ఉపనిషత్తు'** అనే పదం మన చెవిన పడగానే ఒక సుందరమైన, మనస్సుకు ఆహ్లాదకరమైన ఒక అద్భుత దృశ్యం మన మనోఫలకం మీద కదలాడుతుంది.

ప్రశాంతమైన వన వాటికలో ఒక పవిత్రమైన ఆశ్రమం. ఆ ఆశ్రమంలో ఒకచోట ఒక పెద్ద వృక్షం. దాని మొదలు వద్ద ఒక అరుగు. ఆ అరుగుపై శ్రోత్రియుడు, బ్రహ్మ నిష్ఠుడు, కరుణాసముద్రుడు అయిన సద్గురువు. ఆయనకు ఎదురుగా – సమీపంలో శుభ్రం చేసిన నేలపై దర్భాసనాలు వేసుకొని సాధన చతుష్టయ సంపన్నులైన శిష్యులు. ఎంతో వినయ

విధేయతలతో ఆ శిష్యులు గురువుగారి అమృతవాక్కుల కొరకై ఎదురుచూస్తుంటే గంభీరమైన స్వరంతో ఆ గురువు తత్వబోధ చేస్తుండటం **– ఇదీ ఆ దృశ్యం.**

ఉపనిషత్ అనే పదంలో ఈ దృశ్యం దాగి ఉంది. ఎందుకంటే **ఉప అంటే సమీపంగా; ని అంటే క్రింద; షత్ అంటే కూర్చొనుట.** గురుదేవునికి సమీపంగా క్రింద కూర్చొని శిష్యుడు ఈ జ్ఞానాన్ని పొందాలి అని ఈ పదం అంతరార్థం.

గురువుకు దగ్గరగా అంటే కొలుచుకొని ఒక గజం దూరంలో కూర్చోవాలి అని గాని, ఇంకా దగ్గరగా అంటే ఒక అడుగు దూరంలో కూర్చోవాలని గాని అర్థంకాదు. గురువు యొక్క **మనస్సులోని భావాలకు అనుగుణంగా జీవించాలి, – ప్రవర్తించాలి అని.** తాను ఎంత జ్ఞానాన్ని సంపాదించినా **గురువుతో సమానమని భావించకూడదు.** అట్టి అహంకారి ఆధ్యాత్మికరంగంలో పతనమవుతాడు. అందుచేత గురువు కన్న క్రిందుగ కూర్చోవాలి. తన వినయాన్ని, విధేయతను, నమ్రతను వ్యక్తంచేయాలి. ఇంద్రియ మనోబుద్ధులకు అందని ఆత్మతత్త్వాన్ని, **స్థిమితంగా అధ్యయనం చేయాలి.** అదే కూర్చొనుట అంటే. **జ్ఞానగంగ పైనుండి** క్రిందికి ప్రవహిస్తుంది గనుక ఆ జ్ఞాన గంగను మన మస్తకానికి ఎక్కించటానికి **మన తల గురువుయొక్క పాదాల వద్ద ఉండాలి.**

**ఉపనిషత్** అనే పదానికి మరొక అర్థం కూడా ఉన్నది. బ్రహ్మమునకు సమీపంగా మనలను ఉంచగలిగే జ్ఞానాన్ని కలిగి ఉన్నది గనుక ఈ వేదాంతాన్ని ఉపనిషత్ అన్నారు.

అలాగే "బ్రహ్మమును తెలియజేసి, బ్రహ్మ సాక్షాత్కారానికి సహాయపడుతుంది గనుక ఈ బ్రహ్మజ్ఞానాన్ని ఉపనిషత్" అన్నారు.

"సంసారానికి కారణమైన అజ్ఞానాన్ని తొలగించే జ్ఞానం గనుక దీనిని ఉపనిషత్" అన్నారు. (ఉపని–షత్)

చీకటి తొలగాలంటే దీపం కావాలి. అజ్ఞానమనే చీకటి తొలగాలంటే జ్ఞాన మనే దీపం కావాలి. అట్టి జ్ఞాన జ్యోతిని శిష్యునికి అందించి ఉద్ధరించు మహాత్ముడే గురువు. 'గు' అనగా చీకటిని, 'రు' అనగా పోగొట్టువాడు. కనుకనే అజ్ఞానమనే చీకటిని పోగొట్టి జ్ఞాన దీపం వెలిగించిన మహాత్ముని **గురువు** అన్నారు.

నిజంగా జీవునికి పట్టిన ఈ అజ్ఞానం ప్రపంచజ్ఞానం లేకపోవటం వల్ల కలిగింది కాదు. స్వస్వరూప జ్ఞానం, – ఆత్మజ్ఞానం లేకపోవటం వల్ల కలిగిందే. కనుక ఆత్మజ్ఞానం వల్లనే అజ్ఞానం తొలగాలి. ఆ ఆత్మజ్ఞానం **ఆచార్యుని బోధవల్లనే** లభిస్తుంది.

శిష్టాచార సాంప్రదాయంలో బ్రహ్మవిద్య లేదా ఆత్మవిద్య గురు శిష్య **పరంపరగా** వచ్చింది. ప్రస్తుతం మనం అధ్యయనం చెయ్యబోయే ఈ ముండకోపనిషత్ కూడా గురుశిష్య పరం పరగానే వచ్చింది.

గురువైన అంగిరస మహర్షికి, శిష్యుడైన శౌనకునికి మధ్య జరిగిన సంవాదమే ఈ ఉపనిషత్తు. అమరధామానికి ఆనందబాటను వేసిన అమృత రూప ఉపనిషత్తు  ఈ ముండకోపనిషత్తు. దీని గురు పరంపర ఏమిటి?

సృష్టికర్త ఐన **బ్రహ్మదేవుడు** తన పెద్ద కుమారుడైన **అధర్వునికి** ఈ బ్రహ్మ విద్యను అనుగ్రహించగా, అధర్వుడు తన శిష్యుడైన **అంగిరునికి** బోధించాడు. అంగిరుని వద్ద భరద్వాజ గోత్రుడైన **సత్యవాహుడు** నేర్చుకొనగా, ఆ సత్య వాహుని వద్దనుండి **అంగిరసుడు** ఉపదేశం పొందాడు.

ఇలా పరం పరా ప్రాప్తంగా అంగిరసునకు  బ్రహ్మవిద్య లభించగా, శిష్యుడైన **శౌనకుడు** గురువైన అంగిరసుని వద్దకు వెళ్ళి, గురువుకు పాదాభి వందనం చేసి, **"ఓ మహాత్మా! ఏది తెలుసుకొనటం చేత, ఈ సర్వమూ తెలియ బడుతుందో దానిని తెలియజేయమని ప్రార్థించాడు.** ఈ ప్రశ్న శౌనకుని ఆంతరంగిక యశస్సును – అతడి అర్హతను తెలియజేస్తున్నది.

అలా ప్రార్థించిన శిష్యునికి సమాధానంగా గురువు నుండి బయలు దేరిన ఉపదేశం ఎంత అమృత తుల్యంగా ఉంటుందో ఇక మనం రుచి చూడబోతున్నాం. రుచి చూచి వదిలేసే వారెవరో – తృప్తిగా ఈ అమృతాన్ని త్రాగే వారెవరో కాలమే నిర్ణయిస్తుంది.

ఉపనిషత్తును ప్రారంభించబోయే ముందు శిష్టాచార సాంప్రదాయంలో గురుశిష్యులిద్దరూ శాంతి మంత్రాన్ని పఠిస్తారు. శాస్త్రాధ్యయనం నిర్విఘ్నంగా సాగాలని – ఎలాంటి అవాంతరాలు కలగరాదని మనస్ఫూర్తిగా భగవంతుని ప్రార్థిస్తారు. మనమూ శాంతి పాఠంతో ప్రారంభిద్దాం.



# శాంతి మంత్రం:

ఓం భద్రం కర్ణేభిః శ్రుణుయామ దేవాః
భద్రం పశ్యేమాక్ష భిర్యజత్రాః
స్థిరై రంగైః తుష్టువాం సస్తనూభిః
వ్యశేమ దేవహితం యదాయుః ।
స్వస్తిన ఇంద్రో వృద్ధశ్రవాః
స్వస్తినః పూషా విశ్వవేదాః
స్వస్తి నస్తార్క్ష్యో అరిష్టనేమిః
స్వస్తి నో బృహస్పతిర్దధాతు ।
ఓం శాంతిః శాంతిః శాంతిః ॥

**ప్రతిపదార్థం :-** ఓం = పరమాత్మ; దేవాః = దేవతలారా!, కర్ణేభిః = చెవులతో; భద్రం = శుభప్రదమైన మాటలను; శ్రుణుయామ = విందుముగాక!; అక్షిభిః = కనులతో; భద్రం = మంగళప్రదమైన దృశ్యాలను; పశ్యేమ = చూచెదము గాక; యజత్రా = పూజనీయులారా; స్థిరైః అంగైః = దృఢమైన అంగములతో, తనూభిః = శరీరాలతో; తుష్టువాంసః = గానంచేస్తూ; యదాయుః = ఆయువు ఉన్నంతకాలం; దేవహితం = దైవసంబంధమైన కార్యాలను; వ్యశేమ = చేసెదముగాక; వృద్ధశ్రవాః = సనాతన ఋషులచే స్తుతించబడిన; ఇంద్రః = ఇంద్రుడు; నః స్వస్తిః దధాతు = మాకు శుభమును ప్రసాదించును గాక!; విశ్వవేదాః = సర్వజ్ఞుడైన; పూషాః = సూర్యుడు; నః = మాకు; స్వస్తి = శుభమును కల్గించుగాక!; అరిష్టనేమి = ఆపదలనుండి రక్షించు; తార్క్ష్యః = వాయుదేవుడు; నః = మాకు; స్వస్తి = శుభమును ప్రసాదించుకాక; బృహస్పతి = బృహస్పతి; నః స్వస్తిః దధాతు = మాకు శుభమును ప్రసాదించు గాక!,

**భావం :-** ఓ దేవతలారా! మా చెవులతో శుభప్రదమైన మాటలనే విందుముగాక! మా కన్నులతో మంగళకరమైన దృశ్యములనే చూచెదము గాక! దృఢమైన అంగాలతో, శరీరాలతో మిమ్ముస్తుతిస్తూ, మాకు ప్రసాదించిన ఆయుష్కాలమును దైవ సంబంధమైన కార్యాలతో గడిపెదముగాక!

సనాతన ఋషులచే స్తుతించబడిన ఇంద్రుడు మాకు శుభమును ప్రసాదించును గాక! సర్వజ్ఞుడైన సూర్యుడు మాకు శుభమును కలిగించుగాక! ఆపదల నుండి కాపాడే వాయువు మాకు శుభము నొసగునుగాక! మాలోని ఆధ్యాత్మిక సంపదను కాపాడే బృహస్పతి మాకు శుభములను ప్రసాదించుగాక!

ఓం శాంతిః శాంతిః శాంతిః

ఓ పరమాత్మా! ఆధిదైవిక, ఆధి భౌతిక, ఆధ్యాత్మిక తాపములు శాంతించుగాక.

**వ్యాఖ్య :- "ఒక కార్యం ఫలించాలంటే మనప్రయత్నం ఒక్కటే చాలదు. దానికి కాలం, దైవం కూడా అనుకూలించాలి.** ఇలా మానవ ప్రయత్నమూ, దైవసహాయమూ, కాలమూ మూడూ సహకరించాలనే దివ్యభావాన్ని మన అంతరంగంలో నిలుపుకొనుటకే ఈ శాంతి పాఠం. దైవ ప్రార్థన -

(ఓం) ప్రతిశాంతి పాఠము ఓంకారంతోనే ప్రారంభమవుతుంది. ఓంకారమే ప్రణవము. అదే బ్రహ్మస్వరూపం. భగవంతుని రూపమూ - నామమూ ఓంకారమే. ఈ సమస్త ప్రపంచమూ ఓంకారంతోనే నిండియున్నది.

ఓం అంటే నామరూపాలతో కూడిన ఈ జగత్తుకు ఆధారంగా ఉన్న - నామ రూపరహిత పరమాత్మయే. నామరూపాలతో కూడిన జీవుని

యొక్క అసలు సారమే ఈ ఓంకారం - ప్రణవం. ఇది నిరాకారం - నిర్గుణం, నిరంజనం, నిరీహం, నిర్వికారం అయిన ఆత్మయే. ఈ ప్రణవాన్ని, తలచుకొని ప్రార్థన ప్రారంభిస్తున్నారు ఉపనిషత్ ఋషులు.

నిజంగా మనం చేరుకోవలసింది ఈ ప్రణవాన్నే. చేరుకున్న తర్వాత ఇక మిగిలేదేమీ ఉండదు. ఎందుకంటే ఆత్మ అద్వయం. రెండవదేదీ లేదు. అది ఏకం- ఒక్కటే. అయితే ఆత్మను చేరుకొనే ఈలోపల మనం ఈ ప్రపంచంలో ఒక భాగంగా ఉన్నాం. అందుకే సత్యాన్ని గ్రహించేలోగా - ఆత్మాను భూతిని పొందేలోగా మనసాధన - ఉపనిషత్ అధ్యయనం చక్కగా, ఏ ఆటంకాలు లేకుండా సాగాలి. దీనికి ఎందరో సహాయపడాలి. మన అవసరాలన్నీ చక్కగా తీరాలి. **మనస్సు వికలం కాకుండా ఉండాలి.**

అందుకని శుభకరమైన అందమైన దృశ్యాలే కనిపించాలి; మంగళకరమైన, ఆహ్లాదకరమైన శబ్దాలే వినిపించాలి. **దేవతా స్వరూపమైన హృదయస్థానంలో శనిగ్రహం ప్రవేశించటానికి చెవులు, కన్నులు రాజమార్గాలై ఉన్నాయి.** మిగిలిన 3 జ్ఞానేంద్రియాలు అంత ప్రమాదకరాలు కావు. కనుక ఘాతుక దృశ్యాలుగాని; అమంగళకర శబ్దాలుకాని మనలో ప్రవేశించరాదు. అవి మన మనస్సును ఆధ్యాత్మిక రంగం నుండి మరలిస్తాయి. కనుక జాగ్రత్తగా ఉండాలి.

ఇలా కోరుకోవటం అంటే సామాన్యుల లాగా దేవతల వద్దకెళ్ళి లౌకికమైన కోర్కెలు కోరుకోవటమా? కాదు. మనం భౌతిక సుఖభోగాలకోసం ప్రార్థించటం లేదు. జీవితం నుండి తరించటానికి - మన స్వస్వరూపంలో మనం నిలవటానికి చేసే కృషిలో **ఆయువు ఉన్నంత వరకు - ఎట్టి ఇబ్బందులు, ఆటంకాలు కలగకుండా - జ్ఞానాన్ని పొందటానికి, సాధన సాగించటానికి అవకాశాన్ని ప్రసాదించమని దేవతలను ప్రార్థిస్తున్నాం.**

అజామీళుడు **చూడకూడని దృశ్యం** చూచాడు. దానితో పతనమైపోయాడు. రావణుడు **శూర్పణఖ** ద్వారా **వినకూడని మాటలు** విన్నాడు. సర్వనాశనమై పోయాడు. కనుక ఒక్క ఘోరమైన **దృశ్యం;** ఒక్క కటువైన, అశ్లీలమైన **మాట** చాలు – మన ఏకాగ్రతను చెడగొట్టటానికి, మన మనసును వికలం చేయటానికి. మనస్సు సరిగ్గా లేకపోతే బుద్ధి పనిచేయదు. అందుకే ఈ ప్రార్థన.

సాధన పూర్తయిన తర్వాత అన్నింటిలోను, అంతటా దైవాన్నే దర్శించగలస్థితికి వస్తాముగనక ఆపైన ఫరవాలేదుగాని, అప్పటి దాకా మాత్రం మాపై కనికరం చూపండి. ఈ శాస్త్రాన్ని అధ్యయనం చేస్తున్నంతకాలం మాకు ఘోర దృశ్యాలుగాని; అమంగళకర శబ్దాలుగాని కనిపించరాదు, వినిపించరాదు అని ప్రార్థన.

ఇక్కడ **మంగళప్రదమైన వాక్కులు** వింటాం. ఆత్మను గూర్చిన జ్ఞానాన్ని తెలుసుకుంటాం. ఈ విన్న విషయాలను మనస్సులో మననం చేసుకొనేటప్పుడు మనసు కలుషితంగా ఉంటే ఆ శుభమైన విషయం కూడా అశుభంలాగా తోస్తుంది. కనుకనే మంగళకరమైన దృశ్యాలతో శబ్దాలతో మనస్సు నిండి పోవాలని ప్రార్థన.

మంగళప్రదమైన ఆత్మ తత్వాన్ని విని, అట్టి ఆత్మను దర్శించే శక్తి నివ్వమనియే ఈ ప్రార్థన సారాంశం. అందుకే గురుశిష్యుల ఈ ప్రార్థన.

ఈ శక్తినిచ్చే వారెవరు? దేవతలు. **'దానాత్ దేవః'** అన్నారు. అంటే ఇచ్చేవారు దేవతలు అని. అందుకే దేవతలకు ప్రార్థన.

సాధన సక్రమంగా జరిగి అనుభూతిని పొందాలంటే సాధనాక్షేత్రమైన **ఈ శరీరం ఆరోగ్యంగా** ఉండాలి. అవయవాలన్నీ చక్కగా పనిచేయాలి; కాళ్ళతో నడిచిరావాలి. ఇక్కడ రెండు గంటలు కూర్చోవాలి. రోజూ ధ్యానం

చేయాలి. వీటి కోసం కాళ్ళు ఆరోగ్యంగా ఉండాలి. **చూడాలంటే** కళ్ళు బాగుండాలి. **వినాలంటే** చెవులు బాగుండాలి. మాట్లాడాలన్నా, తెలియని విషయం అడగాలన్నా **వాక్కు** బాగా ఉండాలి. మొత్తం అవయవాలన్నీ బాగుంటేనే పూర్తి ఆరోగ్యం. కనుక ఆరోగ్యంగా ఉండాలనీ, అవయవాలన్నీ చక్కగా పనిచేయాలని కోరుకుంటున్నాం. అయితే దేనికి ఈ ఆరోగ్యం? దివ్యసాధనలు చేసి తరించటానికి. అలా కోరుకున్నంత మాత్రాన ఈ దేహం శాశ్వత మనే భ్రాంతి లేదు. అందుకే **యదాయుః** అన్నారు. ఎంతవరకైతే ఈ దేహం ఉండాలో అంతవరకే ఉంటుంది. తర్వాత రాలిపోతుంది. భగవంతుని నిర్ణయానికి తలొగ్గుతున్నాం, అయితే జీవించినంతకాలం ఈ అవయవాలు పుష్టిగా, తుష్టిగా, ఆరోగ్యంగా ఉండాలి. సాధనలకు అనువుగా ఉండాలి అనేదే కోరిక. జీవించి ఉన్న ఈ కాలంలో దేవహితం చేయటానికి మాత్రమే శరీరారోగ్యాన్ని కోరుతున్నారు ఈ ప్రార్థనలో – దైవానికి సన్నిహితం కావటమే దేవహితం.

**ఏయే దేవతలను ప్రార్థిస్తున్నారు? :–** ఇంద్రుడు, సూర్యుడు, వాయువు, బృహస్పతి – వీరంతా ప్రకృతి శక్తులే. వేదకాలంలో ప్రకృతి శక్తులే దేవతలు – ప్రకృతి దేవతల యొక్క అనుగ్రహాన్ని అవసరమని గుర్తించారు కనుకనే ఇంద్రుని ధ్యానిస్తున్నారు. ఇంద్రియాలకు అధిపతి ఇంద్రుడు. కనుక **ఇంద్రియాలు తమ అధీనంలో ఉండాలి అని ప్రార్థన.** సూర్యుని ప్రార్థించటంలో **మనస్సు – జ్ఞాన ప్రకాశంతో నిండి పోవాలని భావన.** వాయువును ధ్యానించుటలో **ప్రాణక్రియను నిరోధించి యోగా రూఢులై తరించాలని కోరిక. ఇలా గ్రహించిన జ్ఞానం దొర్లిపోకుండా, చెదిరిపోకుండా బుద్ధిలో స్థిరంగా నిలవాలని బృహస్పతికి అభ్యర్థన.** ఇలా ఇంద్ర, సూర్య, వాయు, బృహస్పతులను ప్రార్థించిన తర్వాత **3 సార్లు శాంతిః, శాంతిః...** అని పలుకుతున్నారు. ఎందుకు? ప్రారంభించిన కార్యం మధ్యలో

ఆగిపోవటానికి 3 కారణాలున్నాయి. అవే ఆధి దైవిక, ఆధి భౌతిక, ఆధ్యాత్మిక తాపాలు. అవన్నీ తొలగాలని ప్రార్థన –

(i) తుఫానులు, వర్షాలు, వరదలు, భూకంపాలు మొ॥ వన్నీ దైవం చేతిలోనివి. కనుక వీటిని ఆధిదైవిక తాపాలన్నారు.

(ii) చుట్టూ ఉండే జీవరాశి, క్రూర జంతువులు, విషపురుగులు, మన చుట్టూ ఉండే మనుషులు, తగాదాలు, కొట్లాటలు. ఇవన్నీ మనచుట్టూ ఉన్న భూతాల వల్ల వచ్చేవి. కనుక వీటిని ఆధిభౌతిక తాపాలన్నారు.

(iii) శారీరకంగా, మానసికంగా మనకు వైముఖ్యం కలగటం ఆధ్యాత్మిక తాపం అన్నారు. ఈ 3 తాపాలు శాంతించుగాక అని ప్రార్థన.



# ప్రథమ ముండకం

## ప్రథమ ఖండం

**మం॥ ఓం బ్రహ్మోదేవానాం ప్రథమః సంభభూవ**
**విశ్వస్య కర్తా భువనస్య గోప్తా ।**
**స బ్రహ్మవిద్యాం సర్వవిద్యా ప్రతిష్టాం**
**అథర్వాయ జ్యేష్ట పుత్రాయ ప్రాహ ॥ (1)**

**ప్రతి॥** విశ్వస్య కర్తా = సృష్టికర్తయు; భువనస్యగోప్తా = జగద్రక్షకుడు ఐన; బ్రహ్మా = బ్రహ్మదేవుడు; దేవానాం = దేవతలం దరికన్న ; ప్రథమః సంభభూవ = ముందుగా పుట్టెను; సః = అతడు; సర్వ విద్యా ప్రతిష్ఠాం = సకల విద్యలకు ఆధారమైన; బ్రహ్మా విద్యాం = బ్రహ్మా విద్యను; జ్యేష్ఠ పుత్రాయ అథర్వాయ = తన జ్యేష్ఠ పుత్రుడైన అథర్వునకు; ప్రాహ = చెప్పెను.

**భావం:–** సృష్టికర్తయు, జగద్రక్షకుడు ఐన బ్రహ్మాదేవుడు దేవతలందరి కన్న ముందుగ జన్మించెను. అతడు సర్వవిద్యలకు ఆధారమైన బ్రహ్మావిద్యను తన జ్యేష్ట పుత్రుడైన అథర్వునకు తెలియజేశాడు.

**వ్యాఖ్య:–** ఈ ఉపనిషత్తు 'బ్రహ్మ' అనే మంగళ వాచకంతో ప్రారంభ మవుతున్నది. బ్రహ్మ అనే పదం 'బ్రూహి' అనే సంస్కృత పదంనుండి పుట్టింది. **బ్రూహి** అంటే పెద్ద అని అర్థం. కనుక బ్రహ్మ అంటే పెద్దది అని అర్థం. ఎంత పెద్దది? అని ఆలోచిస్తే నీవు ఎంత ఆలోచించినా అంతకన్నా పెద్దది అని భావం. బ్రహ్మ అంటే సృష్టికర్త ఐన చతుర్ముఖ బ్రహ్మ అని ఒక అర్థం. బ్రహ్మ అంటే నిరాకార నిర్గుణ పరమాత్మ అని మరొక అర్థం. ఇక్కడ సృష్టికర్త బ్రహ్మదేవుడే అనే అర్థం సరిపోతుంది.

బ్రహ్మదేవుడు దేవతలందరి కన్న **ముందుగా పుట్టిన వాడు.**

ప్రళయకాలంలో ఒక్క పరమాత్మ మాత్రమే జలరాశిపై ఉంటాడు. ఇంక సృష్టి ఏమీ ఉండదు. ప్రళయకాలం పూర్తికాగానే ఆ పరమాత్మనుండి ముందుగ ఒక **తామర పుష్పంలో నుండి బ్రహ్మదేవుడు** జన్మిస్తాడు. ఆయనను సృష్టిచేయమని పరమాత్మ ఆదేశిస్తాడు. కనుక అందరికన్నా ముందు పుట్టినవాడు బ్రహ్మ. ఆయన సృష్టి కర్త. సృష్టి చేసిన వాడే రక్షించాలి గనుక రక్షకుడూ ఆయనే.

సృష్టి కర్తయైన ఆయనకు సృష్టి చేసే జ్ఞానం ఉండాలి. కనుక ఆయన సర్వజ్ఞుడై యుండాలి. సర్వజ్ఞుడైన ఆయన **సృష్టి చేసినప్పుడు ఆ సృష్టిలో అనేక విద్యలుంటాయి. ఈ విద్యలన్నీ లౌకిక విద్యలు. కనుక అవి సృష్టిని గూర్చి తెలుపుతాయి. జగత్తును గురించి, జగత్తులోని వస్తువుల గురించి, జీవుళ్ళ గురించి** తెలుపుతాయి. అయితే ఈ విద్యలన్నింటికి **ఆధారమైన మరొక** విద్య ఉన్నది. అదే **బ్రహ్మ** విద్య. ఈ లోకంలోని అన్ని విద్యలు బ్రహ్మ విద్యనుండి వచ్చినవే. ఇంటిలోని అన్ని కుళాయిలలో నుండి వచ్చే నీరు overhead Tank నుండి; అన్ని నదులలోని నీరు సముద్రం నుండి వచ్చినట్లుగ. – ఆ బ్రహ్మ విద్య సృష్టిని గురించిగాక సృష్టి కర్తను గురించి తెలియజేస్తుంది. సృష్టిలోని విద్యలన్నీ ఎంతగా నేర్చుకున్నా మృత్యువును దాటటానికి వీలులేదు. అయితే **బ్రహ్మ విద్య మాత్రం మృత్యువును దాటించ గలదు.** అమృతత్వాన్ని ప్రసాదించగలదు.

**పొందలేవు నీవు పరి పూర్ణ శాంతిని**
**కవిత చేసిగాని, పాట నేర్చిగాని,**
**నేల నేలినగాని, నింగి తాకిన గాని,**
**నిన్ను తెలియక నీకు శాంతి రాదు.**

నీవు ఎన్ని చేసినా – ఎంతనేర్చినా పరిపూర్ణ శాంతిని పొందలేవు.

నిన్ను నీవు తెలుసుకుంటేనే శాంతి. పరిపూర్ణ శాంతి. ఎన్నోబాధలతో దరిచేరిన ఆపన్నులకు **భగవాన్ రమణ మహర్షుల వారిచ్చే సలహా ఇదే. "నిన్ను నీవు తెలుసుకో".** నీ బాధలన్నీ తొలగిపోతాయి. ఆనందం కలుగుతుంది - అని. నిన్ను నీవు తెలుసుకొనే విద్యయే బ్రహ్మ విద్య - ఆధ్యాత్మిక జ్ఞానవిద్య - ఆత్మ జ్ఞాన విద్య. **మృత్యువును జయించాలంటే ఈ విద్యను నేర్వాలి.** అందుకే వేమనయోగి అంటారు. **"చదివి చదివి చదివి చావంగ నేటికి, చావులేని చదువు చదువ వలయు అని** - చావులేని చదువు బ్రహ్మ విద్యయే. అది అమృతం. **ఇట్టి బ్రహ్మ విద్యను బ్రహ్మదేవుడు తన పెద్దకుమారుడైన అథర్వునకు బోధించాడు.**

మొట్ట మొదటి సారిగా బ్రహ్మ చేత ఉపదేశించబడిన విద్య గనుక దీనిని **బ్రహ్మ విద్య అన్నారు. బ్రహ్మచేత రాయబడిన రాతను బ్రహ్మరాత అన్నారు.** దాన్నైనా దీన్నైనా - తెలుసు కోవటం చాలా కష్టం.

తండ్రికి బిడ్డపై వాత్సల్యం ఉంటుంది. తన బిడ్డ చాలా గొప్పవాడు కావాలని ప్రతి తండ్రీ ఆశిస్తుంటాడు. అలాగే తండ్రిపై బిడ్డకు ప్రేమ, గౌరవము ఉంటాయి. అదే గురువు మీద అయితే భక్తి శ్రద్ధ కూడా ఉంటాయి. **మరి తండ్రీ - గురువూ ఒక్కరే అయితేనో - ప్రేమ, గౌరవం, భక్తి శ్రద్ధ చనువు అన్నీ ఉంటాయి. వీటివల్ల ఆ తండ్రి నుండి గొప్పజ్ఞానాన్ని పొందే అవకాశం బిడ్డకు కలుగుతుంది.**

- అందువల్లనే తన తండ్రినే గురువుగా జేసికొని వరుణుని వద్ద భృగువు వేదాంత జ్ఞానాన్ని అభ్యసించాడు.
- తన తండ్రినే గురువుగా జేసికొని వ్యాసమహర్షి వద్ద శుక మహర్షి వేద వేదాంగాలను అభ్యసించాడు.
- తన తండ్రినే గురువుగా జేసికొని ఉద్దాలకుని చెంత ఆశీనుడై శ్వేతకేతువు ఆత్మజ్ఞానాన్ని అభ్యసించాడు.

❖ అలాగే ఈ ఉపనిషత్తులో అధర్వుడు కూడా తన తండ్రియైన బ్రహ్మదేవునే గురువుగా భావించి బ్రహ్మవిద్యను నేర్చుకున్నాడు. నిజమైన గురువులెవరైనా స్వస్వరూప జ్ఞానమునే అందిస్తారు. మరి గురువులకు గురువైన ఆది గురువు బ్రహ్మ దేవుడు కూడా అట్టి బ్రహ్మ జ్ఞానమునే – స్వస్వరూప జ్ఞానమునే తన జ్యేష్ఠ కుమారుడైన అధర్వునికి తెలియజేశాడు. ఇలా నేర్చుకొన్న జ్ఞానాన్ని అధర్వుడు ఇతరులకు అందజేసిన పరంపరను రాబోవు మంత్రం తెలియజేస్తుంది.

– ఈ బ్రహ్మ విద్య పరంపరాక్రమం ఈ మంత్రంలో –

**మం॥ అధర్వణే యాం ప్రవదేత బ్రహ్మా**
**అధర్వా తాం పురోవాచాంగిరే బ్రహ్మవిద్యాం ।**
**స భరద్వాజాయ సత్య వాహాయ ప్రాహ**
**భారద్వాజోఽంగిరసే పరావరం ॥ (2)**

**ప్రతి॥** అధర్వణే = అధర్వునకు; బ్రహ్మ = బ్రహ్మదేవుడు; యాం = ఏ జ్ఞానమును; ప్రవదేత = తెలియజేసెనో; తాం బ్రహ్మ విద్యాం = ఆ బ్రహ్మవిద్యను; అధర్వా = అధర్వుడు; పురా = పూర్వము; అంగిరే = అంగిరునికి; ఉవాచ = చెప్పెను; సః = అతడు (అంగిరుడు) ; భారద్వాజాయ సత్యవాహాయ = భారద్వాజ గోత్రుడైన సత్యవాహునకు; ప్రాహ = చెప్పెను; భారద్వాజః = సత్యవాహుడు; పరావరం = ఆ పరావిద్యను; అంగిరసే ప్రాహ = అంగిరసునికి చెప్పెను.

**భావం:–** అధర్వునకు బ్రహ్మదేవుడు ఏవిద్యను తెలియజేసెనో అట్టి బ్రహ్మ విద్యను అధర్వుడు పూర్వము అంగిరునకు చెప్పెను. అంగిరుడు దానిని భారద్వాజ గోత్రుడైన సత్యవాహునకు ఉపదేశించగా, సత్యవాహుడు ఆ పరావిద్యను అంగిరసునకు బోధించెను.

మావద్ద లభించే అన్ని పుస్తకముల వివరముల కొరకు ఈ క్రింది లింక్(URL) పై క్లిక్ చేయండి : http://www.srichalapathirao.com/catalog

"ముండకోపనిషత్తు (ముండక ఉపనిషత్తు)"గ్రంథంపై పూజ్య గురుదేవులు "శ్రీ దేవిశెట్టి చలపతిరావుగారు" చేసిన వ్యాఖ్య 200 పేజీలకు పైగా ఉన్న పుస్తకములు మా వద్ద లభించును

Ebooks మీరు DOWNLOAD చేసుకొనుటకు రూ.200/- లేదా పుస్తకమును మేము మీ ఇంటికి పంపాలంటే (courier ఖర్చులు అదనం కలిపి) ONLINE లో చెల్లించుటకు -

Click & Pay us through Paytm : 

http://srichalapathirao.com/images/paytm_QR_WWWSRICHALAPATHIRAOCOM.png

లేదా

Pay us through Net Banking : 

http://srichalapathirao.com/PDFs/Bank.pdf

మీకు మరేదైనా సందేహం ఉంటే care@srichalapathirao.com కు ఈమెయిల్ పంపగలరు లేదా +91 80085 39770 OR +91 95388 58115 నంబర్లకు ఫోన్ చేయగలరు

అన్ని పుస్తకములను లేదా కొన్ని పుస్తకములను లేదా గురుముఖతా ప్రవచనములను (వీడియో ప్రవచనముల కొరకు) శ్రవణం చేయుటకు DVD, External Hard Disk లేదా Audio CD, Pen Drive కొరకు ఈ క్రింది లింక్(URL) పై క్లిక్ చేయండి : http://www.srichalapathirao.com/catalog